# గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ అష్టమి
1946 సం॥ జూలై 6 శనివారం
శు॥ అష్టమి రా 11-29 వ. ప 4-24 వర్జ్యం రా 1-10 ల 2-55 కు.
శు॥ నవమి జూలై 7 ఆదివారం
ఆశ్రే నవమి రా 1-20 వి.సా 6 43 వర్జ్యం రా 12 59 ల 2-46 కు.

ఆంధ్రపత్రిక
వ్యయ సం॥ ఆషాఢ శు॥ అష్టమి
శనివారము

## నూలు వస్త్రముల ధరలు

ఆగస్టుమాసము 1 వ తేద నుండి ముతకనూలు, నూలువస్త్రముల గరిష్టధరల హెచ్చించుటకును, సన్ననూలు వస్త్రముల గరిష్టధరల తగ్గించుటకును నిర్ణయమైనట్లు టెక్స్టైల్ కంట్రోలు బోర్డు అధ్యక్షులు థేకర్సేగారు గురువారం బొంబయిలో జరిగిన టెక్స్టైల్ కంట్రోల్ బోర్డు సమావేశమున ప్రకటించిరి. ఆగస్టు 1వ తేదీనుండి కార్మికులు పని చేయు కాలము తొమ్మిదిగంటల నుండి ఎనిమిదిగంటలకు తగ్గింపబడుననియు, అందువలన మిల్లులు ఇచ్చుకొనవలసిన కూలి మొత్తము హెచ్చును కనుక నూలు, నూలు వస్త్రముల ధరల నీ విధముగ మార్పు చేయవలసిన అవసరము ఏర్పడినదని వీరు కారణములను తెలిపిరి. కారణములు సహేతుకములైనవా, నిర్హేతుకమైనవా అనే మీమాంసను వదలి నూలు వస్త్రముల గరిష్టధరలను పెంచుట ఉచితమా అనుచితమా, న్యాయమా, అన్యాయమా యను విషయముల విచారించిన ముతకవస్త్రముల ధరలను పెంచుట అనుచితమేగాక, అక్రమమని కూడ విశదము కాగలదు. సాధారణముగ సన్నని వస్త్రముల వాడుక చేయువారు ధనవంతులు. ముతక వస్త్రముల వినియోగించువారు సామాన్యప్రజలు. అట్టి సందర్భములలో సన్నని వస్త్రముల ధరల తగ్గించి ముతకవస్త్రముల ధరలను పెంచుట యందలి ఔచిత్యము, న్యాయము, అధికారవర్గమువకే అర్థము కావలెను.

టెక్స్టైల్ కంట్రోలు బోర్డు పూర్తిగ మిల్లు యజమానుల అదుపు ఆజ్ఞలకు లోబడియున్నవి. వాడుకదారుల ప్రతినిధు లాబోర్డు నందు అల్పసంఖ్యాకులుగ నుండిరి. కనుక బోర్డు నిర్ణయములు ఎప్పుడు మిల్లు యజమానులకే అనుకూలముగ నుండును. కాని ప్రభుత్వమువారు ఆ నిర్ణయముల అంగీకరించి అమలుజరుపునప్పుడు మంచి చెడ్డలను పరిశీలింపవలసి యుండును. ఇప్పటి ప్రభుత్వమునకు సామాన్య ప్రజల యోగక్షేమముల విషయమున శ్రద్ధలేదు. ఈధరల హెచ్చింపును విమర్శించుచు టెక్స్టైల్ కంట్రోలుబోర్డు సభ్యులు హుస్సేన్ ఇమామ్, మిత్రా, మిరాజ్కర్ ప్రభృతులు ప్రకటన ఈ విషయమును విస్పష్టము చేయుచున్నవి. దేశీయమిల్లులలో తయారగు వస్త్రములు [illegible] నాటికి [illegible] పెరుగుచున్నవి, ఇట్టి ఫలితములను చూచియు బోర్డు నిర్ణయమును ప్రభుత్వమువారు అంగీకరించుట ఆశ్చర్యకరముగ నున్నదని వీరి ప్రకటనలో తెలిపిరి.

ఇప్పటికే మామూలు ప్రజలు వాడుకచేయు వస్త్రముల ధరలు విపరీతముగ పెరిగినవి. వాటి నింకను హెచ్చుచేయుట ఏవిధమునను సమర్థనీయముగాదు. మిల్లు యజమానులు కార్మికుల సమ్మెల, జీతనముల వృద్ధివలన కలుగు అదనపువ్యయమును తమ లాభములనుండి సరిపుచ్చుకొనుటకు బదులు, వినియోగదారుల నుండి సంపాదింప బూనుకొనుట న్యాయముగాదు. మొదటినుండియు ప్రభుత్వమువారు మిల్లు యజమానుల యెడ ప్రత్యేకాభిమానము చూపుచున్నందుననే నేడీ స్థితి ఏర్పడినది. చేనేత పరిశ్రమాభివృద్ధిని అరికట్టి వస్త్రవ్యాపారమును యావత్తు మిల్లుయజమానులకు గుత్తకు ఇచ్చిరి. దేశమున వస్త్రకాటక మేర్పడి చేనేతపారిశ్రామికులలో నూలు కొరతవలన నిర్వ్యాపారత ఎక్కువగుచున్నను ప్రభుత్వమువారీ విధానమును మార్చుకొనలేదు. అంతేగాక, ముతకనూలు ధరల నింకను హెచ్చించుట కిప్పుడు నిర్ణయించుటవలన అదనపు ఇబ్బందులు ఏర్పడుచున్నవి. కంట్రోలు ధరలకు చేనేత పారిశ్రామికులు నూలును పొందలేకున్నారు. కంట్రోలుధరల పెరుగుదలతో 'బ్లాక్ మార్కెట్' ధరలు కూడ పెరిగిపోయి మగ్గములన్నియు పూర్తిగ మూలబడిపోవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చును.

చేనేతవస్త్రముల ధరలను కూడ కంట్రోలు చేయుటకు మద్రాసు ప్రభుత్వమువారు నిర్ణయించిరి. వస్త్రముల తయారీ ధరలనుబట్టి విక్రయధరలను నిర్ణయింపవలసి యుండగా, రాష్ట్ర ప్రభుత్వము నూలుకు సక్రమమైన ధర నిర్ణయము గుటకు, ఆ ధరల ప్రకారము చేనేతపారిశ్రామికులకు నూలు సప్లయి అగునట్లు చూచుటకు ఇంతవరకు సరియైన ఏర్పాటులను మద్రాసు ప్రభుత్వమువారు చేసినట్లు కన్పించదు. దాదాపు మూడుసంవత్సరములుగ చేనేతపారిశ్రామికులు ఇందు విషయమై ఆందోళన చేయుచుండిరి. కాని పరిస్థితియందెట్టి మార్పు కలుగలేదు.

టెక్స్టైల్ బోర్డు నిర్ణయము అమలుజరుగకుండ రాష్ట్ర ప్రభుత్వములు చర్య తీసుకొనవలసినదని హుస్సేన్ ఇమామ్ ప్రభృతులు సూచించియుండిరి. ఇతర రాష్ట్రముల ప్రభుత్వములకంటె మద్రాసు ప్రభుత్వమున కీవిషయమున ఎక్కువ బాధ్యత ఉన్నది. వస్త్రపరిశ్రమను యావత్తు విచారించి అన్నివర్గములకును న్యాయముగ నుండునట్టి విధానమును మద్రాస్ ప్రభుత్వము అనుసరించునని ఆశించుచున్నాము.

## చైనా జపాన్లకు పత్తి ఎగుమతి

న్యూఢిల్లీ, జూలై 3: వాణిజ్యశాఖవారి నిరంతరకృషి ఫలితంగా, దేశానికి అనవసరమైన 3 లక్షల బేళ్ల ప్రత్తిపింజ మాదిరి జపానుకు ఎగుమతి చేయడానికి వీలైంది. జపానుకు కావలసిన మాదిరిఅంతా తానే సప్లయిచేస్తానని, అమెరికా భారతదేశాన్ని అంగీకరింప [illegible] చేయడానికి ప్రయత్నించినది.

చైనా జపాన్లకు పంపవలసినదిపోగా, మిగిలేది స్వదేశావసరాలకు [illegible] ప్రభుత్వవర్గాలు [illegible] భారతదేశంనుంచి చైనాకు 2½ లక్షలబేళ్లు ఎగుమతికి అనుమతి అయినది. భారతదేశం [illegible] సంపాదించవలెనని చేసే ప్రయత్నమేనని దక్కడివారంటున్నారు.

## ఏ.ఐ.సి.సి. సమావేశం

1 పేజీ తరువాయి

కపు ఎ. ఐ. సి. సి. సభలో వామ పక్షంవారు, ముఖ్యంగా కాంగ్రెస్ సోషలిస్టులు, ప్రతిఘటించడానికి సంకల్పించారు. ప్రజాపరిషత్తులో తాను పాల్గొనబోవటం లేదని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నాయకుడు జయప్రకాశనారాయణగారు బహిరంగంగా ప్రకటించారు. బ్రిటిషు వ్యాపార సంస్థలతో సంబంధంవున్న వారి నెవరినీ ప్రజాపరిషత్తుకు సభ్యులుగా ఎన్నుకోకూడదని అచ్యుత్ పట్వర్ధన్ గారు అభిప్రాయపడుతున్నారు. దీన్నిబట్టి, అచ్యుత్ పట్వర్ధన్ గారు బ్రిటిషుమంత్రిత్రయ ప్రతిపాదనల లోని ప్రధానాంశాలకు సముఖంగా లేవున్నారని భావించడానికి వీలవుతున్నది. స్వతంత్ర భారత రాజ్యాంగరచననిమిత్తం బ్రిటిషు ప్రతిపాదనలననుసరించి ప్రజాపరిషత్తు ఏర్పడాలన్నదే పట్వర్ధన్ గారి అభిప్రాయమన్నమాట.

## ఫార్వర్డ్ బ్లాక్ వైఖరి

మంత్రిత్రయం ప్రతిపాదించిన రాజ్యాంగప్రతిపాదన విషయమై ఏ. ఐ. సి. సి. లోని ఫార్వర్డ్ బ్లాక్ సభ్యుల వైఖరి ఏవిధంగా ఉండవలెనందీ స్పష్టీకరిస్తూ సర్దార్ శార్దూల సింగు కవీశర్ గారు లాహోరునుండి ఈ కింది ప్రకటన చేస్తున్నారు. "ఏ. ఐ. సి. సి. లో ఫార్వర్డ్ బ్లాక్ సభ్యులు కాంగ్రెసు కార్యవర్గనిర్ణయాన్ని నిస్సందేహంగా ప్రతిఘటించవలసింది. ఫార్వర్డ్ బ్లాక్ కార్యవర్గం కూడా ఇదే విధంగా తీర్మానించివున్నది. మంత్రిత్రయ ప్రతిపాదనలను తోసివేయాలని ఉద్ఘాటిస్తూ శీలభద్రయాజీగారు ప్రతిపాదించబోతున్న తీర్మానాన్ని గాని, అదే పద్ధతిలో ప్రతిపాదించే తదితర తీర్మానాలను గాని ఫార్వర్డ్ బ్లాక్ సభ్యులు బలపరచాలి.

మంత్రిత్రయ ప్రతిపాదనలు న్యాయమైనవని గాని ఘనం అభిప్రాయపడటం లేదు. కాబట్టి, ప్రజాపరిషత్తులో మనం చేరడానికి వీల్లేదు. ప్రజాపరిషత్తు అభ్యర్థిగా నిల్వవలసిందని పంజాబు, సిక్కులు కొందరు నన్ను ఆహ్వానించారు. ఈ ఆహ్వానాన్ని నిస్సందేహంగా నిరాకరించాలన్నదే నా అభిమతం. ఇతర ప్రాంతాలలోని ఫార్వర్డ్ బ్లాక్ సభ్యులుకూడా ఇదే వైఖరి అవలంబిస్తారని నా అభిప్రాయం.

వామపక్షం వారిలో కొందరు ఈవిధంగా ఆక్షేపణలు, అభ్యంతరాలను చెబుతున్నప్పటికీ, ఏ.ఐ.సి.సి.లో తమ తీర్మానాన్ని అధిక సంఖ్యాకుల ఆమోదంతో నెగ్గించుకోగలమనే కాంగ్రెస్ కార్యవర్గం వారి విశ్వాసం.

ఏ. ఐ. సి. సి. లో దాదాపు 400 మంది సభ్యులున్నారు. వీరిలో 300 మందో లేక 350 మందో హాజరవుతారు. ఇది చారిత్రాత్మకమైన సమావేశం. యథేచ్ఛగా చర్చలు జరుపుకోడానికి వీలుగా సభకు ఇతరులుగాని, పత్రికా విలేఖరులు గాని హాజరుకాకూడదని కాంగ్రెస్ హైకమాండ్ మొదట అనుకున్నది. దినపత్రికలలో చర్చలు పూర్తిగా అచ్చుపడడం అవసరం కాబట్టి పత్రికా విలేఖరులను తప్పక హాజరుకానివ్వాలని నెహ్రూగారు కాంగ్రెస్ కార్యవర్గంతో గట్టిగా వాదించాడు.

## అధ్యక్షుడెవరు?

ఈ ఏ. ఐ. సి. సి. సమావేశానికి మౌలానా ఆజాద్ అధ్యక్షత వహిస్తాడో, లేక పండిట్ నెహ్రూ వహిస్తాడో ఇంకా తేలలేదు. ఈ విషయంలో భేదాభిప్రాయం కనిపిస్తున్నది. 5-వ తేదీన కాంగ్రెస్ కార్యవర్గం ఒక నిర్ణయాన్ని చేయవలసివున్నది. ఏ పద్ధతిలో ప్రవర్తిస్తే కాంగ్రెసు కార్యవర్గ నిర్ణయాన్ని ఏ. ఐ. సి. సి. ఆమోదిస్తుందో కూడా హైకమాండ్ ముందుగానే తేల్చుకుంటుంది.

## బొంబైకి గాంధినెహ్రూల రాక

బొంబై, జులయి 5: గాంధీజీ ఉదయం 10-35 గంటలకు బొంబై చేరాడు. దాదర్ స్టేషనులోనే దిగాడు. పండిట్ నెహ్రూ కూడా ఇక్కడికి చేరాడు. గాంధీజీ ప్రయాణంచేసిన 'ఎక్స్ప్రెస్ ట్రేన్' అనే రైలులోనే శంకరరావు దేవ్ గారు కూడా వచ్చారు.

గాంధీజీ బొంబై హరిజనవాడలో బస చేస్తాడు. 5-వ తేదీ అపరాహ్ణం 2 గంటలకు కాంగ్రెసు కార్యవర్గం భూలాభాయి దేశాయిగారి ఇంట సమావేశమవుతుందని తెలుస్తున్నది.

ఏ. ఐ. సి.సి. సమావేశం సర్ కావాస్జీ జహంగీర్ హాలులో జరుగుతుంది. ఈ సభ ఇక్కడ జరగడం ఇదే మొదటి సారి. సర్దార్ పటేల్, కృపలానీ, పంత్, రాజగోపాలాచారిగారలు బొంబైకి చేరారు. [illegible] ఏ. ఐ. సి. సి. చర్చిస్తుందని తెలుస్తున్నది.

ప్రస్తుతం జరగబోతున్న అఖిలభారత కాంగ్రెసకమిటీ సమావేశమే, [illegible] కాబట్టి [illegible] అఖిలభారత కాంగ్రెస్ మహాసభవలె పనిచేస్తుంది.

## పత్రికా విలేఖరులకు ప్రవేశ సౌకర్యం

బొంబై, జూలై 4: ఏ. ఐ. సి. సి. సభకు పత్రికా ప్రతినిధులను రానిచ్చే విషయమై కాంగ్రెసు భవనంనుంచి ఈ క్రింది ప్రకటన వెలువడింది: "విదేశీయపత్రికా విలేఖరులకు, భారతదేశ పత్రికా విలేఖరులకు తగినంతమందికి అనుమతి ఇవ్వడానికి నిర్ణయించడమైనది. విలేఖరులు కూర్చోడానికి స్థలం కొద్దిగానే వున్నది కాబట్టి న్యూస్ ఏజెన్సీ ప్రతినిధులకు, స్థానిక దినపత్రికా విలేఖరులకు, తదితర ప్రధాన దినపత్రికల ప్రతినిధులకు మాత్రమే 'పాసులు' ఇవ్వడమవుతుంది. ప్రవేశాన్ని ఈ విధంగా పరిమితం చేస్తున్నందుకు మిగతవారు మన్నిస్తారని ఆశిస్తున్నాము. విలేఖరులకు 'పాసులు' కాంగ్రెసు భవనంవద్ద శుక్రవారంనుంచీ ఇస్తారు."

## వామపక్షం వర్కింగుకమిటీ తీర్మానాన్ని ప్రతిఘటిస్తుంది

బొంబాయి, జూలై 4: బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమునకు కావలసిన ప్రారంభసన్నాహములన్నియు పూర్తియైనవి. కాంగ్రెసు మహాసభ కార్యదర్శియైన ఆచార్య కృపలానీగారు యీ సభ సన్నాహములకు కావలసిన చిట్టచివరి బందోబస్తులను కొన్ని చేసి సన్నాహములను సర్వసమగ్రం చేశారు.

బ్రిటిషు రాయబార మంత్రులున్నూ వైస్రాయియున్నూ మే నెల 16 తేదీని జూను 16 తేదీని చేసిన ప్రకటనలను గూర్చి కాంగ్రెసు వర్కింగుకమిటీ చేసిన తీర్మానమును అ. భా. కాం. కమిటీ ఆమోదించవలసియున్నది. తాత్కాలిక ప్రభుత్వవర్గము విషయంలో కాంగ్రెసు వర్కింగుకమిటీ అంగీకరించలేదు. భవిష్య రాజ్యాంగరచన విషయములో అంగీకరించినది.

ఈ వర్కింగుకమిటీ తీర్మానమును విమర్శించి చర్చించుటలో యీ అ. భా. కాం. కమిటీ సమావేశము చాలా వ్యవహార సరళిలో కట్టుదిట్టముగా జరుగునే గాని, ఉపన్యాసాడంబరములతోను ఆవేశ ప్రదర్శనములతోను కాలక్షేపము చేయదు.

ఈ సమావేశము చాలా ముక్తసరిగా వ్యవహారదృష్టితో జరుపబడును ఈ సమావేశము ఇకముందు కాంగ్రెసు మహాసభ చర్చలకుకూడా ఆదర్శప్రాయముగా నుండగలదు.

అ. భా. కాం. కమిటీ సభారంభమునందు కాంగ్రెసు ప్రెసిడెంటయిన ఆజాదుగారు ఉపన్యసిస్తారు. బ్రిటిషు మంత్రిత్రయము గత మూడుమాసములు యీ దేశంలో ఉండి నడిపించిన వ్యవహారముల నన్నింటిని సవిమర్శిస్తూ ఆజాదుగారు ఉపన్యసిస్తారు. ఆజాదుగారి యుపన్యాసానంతరము వర్కింగుకమిటీవారి తీర్మానమును నెహ్రూగారు సభలో ప్రతిపాదిస్తారు.

కాంగ్రెసులోని వామపక్ష నాయకులు ఈ తీర్మానమును అధిక్షేపిస్తారని తెలియుచున్నది.

తాత్కాలిక ప్రభుత్వవర్గ పథకమును నిరాకరించుట బాగానేయున్నది. గాని రాజ్యాంగ రచనా పథకములను ఆమోదించుట సమంజసముగా లేదని వామపక్షము అధిక్షేపిస్తోంది.

రాజ్యాంగ పరిషత్తుకు సర్వస్వతంత్రాధికారములు యివ్వబడలేదనియు, చిట్టచివరకు బ్రిటిషువారు యీ దేశంలో తమ సైన్యములను స్థిరంగా ఉంచుటకొరకున్నూ ఈదేశాన్ని ఆర్థికంగా పీడించుటకున్నూ వీలైన అక్రమమరసులను మనలను ఒప్పించుటకు వీలుగా యీ రాజ్యాంగ పరిషత్పథకములో కొన్ని పద్ధుపాయములను కల్పించుకొన్నారనియు అవియే ఈపథకంలోని అవలక్షణములనియు వామపక్షమువారు వాదించుచున్నారు.

సామ్రాజ్యాధికారులతో సాధారణ సంప్రదింపుల ద్వారా స్వరాజ్యము లభించునను మాట కేవలము స్వవచనవ్యాఘాతమని ఒక వామపక్షనాయకుడన్నాడు.

వామపక్షనాయకులు ప్రతిఘటించినప్పటికీ వర్కింగుకమిటీ తీర్మానము అధిక సంఖ్యాకులచే సభలో ఆమోదింపబడగలదనే నమ్మకము చాలామందికి ఉన్నది.

## శాంతి సమావేశం

1 వ పేజీ తరువాయి

బెవిన్ మాట్లాడుతూ, సోవియెట్ యూనియన్ 10 కోట్ల డాలర్ల పరిహారాలను పొందడం లేకూ అంగీకారమే కాని, ప్రస్తుతం ఇటలీ బ్రిటన్ సహాయంపైనాధారపడి ఉన్నది కనుక 6 సంవత్సరాల వరకూ పరిహారాలు చెల్లించే స్థితిలో లేదని అన్నాడు.

ఇటలీ ఆక్రమణల విషయంలో నాలుగు రాజ్యాలవారు వేసిన అంచనాలు నాలుగు విధాలుగా ఉన్నాయని, నిజంగా ఎంత ఉన్నాయో తేల్చేందుకు నాల్గు రాజ్యాల నిపుణుల సంఘాన్నొకదాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలని బెవిన్ అన్నాడు.

రష్యాకేకాక, ఇంకా ఇటలీనుంచి పరిహారాలను కోరే ఇతర రాజ్యాల విషయం 2 రాజ్యాల శాంతి సమావేశానికి వదిలిపెట్టాలని కూడా బెవిన్ సూచించాడు. దీనికి మొలటావ్ తన ఆమోదం తెలిపాడు. అయితే, మంత్రులు మూడుముఖ్య విషయాలకు అంగీకరించాలన్నాడు. (1) రష్యాకు 10 కోట్ల డాలర్లు ఇవ్వాలి. (2) ఇంగ్లండులో కాంతి ప్రస్తుత ఉత్పత్తిలోనుంచి ఇవ్వాలి (3) వసూళ్ళ ప్రారంభకాలం విషయంలో రష్యాకు గల అభ్యంతరాన్ని దృష్టిలో పెట్టుకొని చెల్లువేసే కాలాన్ని నిర్ణయించడం.

ఈ మూడింట్లో మొదటి రెండింటినీ తాను ఆమోదిస్తున్నట్లూ, 3-వ దానికి తన కిష్టంలేనప్పటికీ రాజీ పడగలన్న ఉద్దేశంతో వసూళ్ళ ప్రారంభకాలం 3 సంవత్సరాలనుంచి 2 సంవత్సరాలకుమార్చడానికి తాను సంసిద్ధుడనని బెవిన్ అన్నాడు.

అపైనే మొలటావ్ వసూళ్ళ ప్రారంభకాలం విషయంలో ఈ నిబంధన లోగడ గ్రస్తే పరిహారాలు చెల్లించవలసినకాలాన్ని 6 ఏళ్ళనుంచి 7 ఏళ్ళకు పొడిగిస్తామని అన్నాడు.

ఇందుకు బెవిన్ అంగీకరించలేదు. బైర్న్స్ కూడా బెవిన్ వాదాన్నే సమర్థించాడు. అంతేకాక వసూళ్ళ ప్రారంభకాలాన్ని అట్లావుంచి, కావాలిస్తే పరిహారాలు చెల్లించవలసిన కాలాన్ని 5 ఏళ్ళకు తగ్గించవచ్చుకూడా తనకిష్టమేనన్నాడు.

అనిరాదట మొలటావ్ ఇటలీ చెల్లించే 10 కోట్లలో 7 కోట్లు ప్రస్తుత ఉత్పత్తి మీదా, మిగతా 3 కోట్లూ ఆస్తిపాస్తుల మీదా చెల్లించడానికి ఒప్పుకుంటారా అని అడిగాడు.

అట్లాకాదని 7 కోట్లు ఆస్తిపాస్తుల మీదా, 3 కోట్లు ప్రస్తుత ఉత్పత్తిమీదా చెల్లించడానికి వీలవుతుందని బెవిన్ అన్నాడు.

మొత్తంమీద విదేశాంగ మంత్రులు పరిహారాల విషయంలో ఒక సమాధానానికి వచ్చారు. ఇక ఒడంబడికలో అవసరమైన దిద్దుబాట్లు జరగడమే తరవాయి.

శాంతి సమావేశం జూలై 29 వ తేదీ సోమవారంనాడు ప్రారంభం కావాలని ఫ్రాన్సువిదేశాంగమంత్రి బిదాల్టు సూచించాడు. బెవిన్ మొలటావ్, బైర్న్స్లు వరుసగా ఈ సూచనను అంగీకరించారు.

21 రాజ్యాలకూ ఆహ్వానాలు వీలైనంత త్వరలో పంపవలసివున్నదనీ, ఆహ్వానాలను రేపు వ్రాయవలసిందనీ ప్రతినిధులకు తెలిపారు.

శాంతి సమావేశానికి రావలసిందని ఈ దిగువ 21 రాజ్యాలకు ఆహ్వానాలు పంపడానికి నిశ్చయించారు: ఆస్ట్రేలియా, బెల్జియం, బ్రెజిల్, కెనడా, చైనా, చెకస్లావాకియా, ఎథియోపియా, ఫ్రాన్సు, గ్రీసు, హాలెండు, భారతదేశం, నార్వే, న్యూజీలాండు, పోలాండు, రష్యా, దక్షిణాఫ్రికా, ఉక్రేన్, బ్రిటన్, అమెరికా, వైట్ రష్యా, యుగోస్లావియా.

## అధికారుల ప్రభుత్వం

1 వ పేజీ తరువాయి

చిక్కులు ఆరంభము అయినవి. బీహారు రాష్ట్రములో డాములకు పైప్రదేశములో డాములక్రింద పోయే విస్తీర్ణానికన్నా, జలాశయముక్రింద పోయే భూములకున్నా నేడు అమలులో ఉన్న ధరతోపాటు నూటికి నాల్గువర్ల వంతున ప్రతిఫలము యివ్వవలెనని కోరినారు. పయిగా ఈ డాములు కట్టినందువల్ల ఖాళీచేయవలసిన ప్రదేశాలలో ప్రజల బాధ్యతను అంతా భారతదేశ ప్రభుత్వమువారే వహించవలెనని బీహారురాష్ట్ర ప్రభుత్వమువారు కోరినారు.

బెంగాలు రాష్ట్రమువారు తమరాష్ట్ర సరిహద్దులలో ఉండే ఎలెక్ట్రిక్ పవరు మీద తమకే అధికారము ఉండవలెనని కోరినారు.

ఇప్పటి అంచనాప్రకారము ఈ ప్రాజెక్టులకు నూటాఇరువదికోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది.

ఈ సందర్భములో ఒక్క విషయము గుర్తు ఉంచుకోవలెను. ఎలెక్ట్రిసిటీ, భూములు, నదులు, ఇరిగేషన్ ఇందలయినవి రాష్ట్రీయ ప్రభుత్వాలకు సంబంధించిన శాఖలు. కాని కేంద్రానికి సంబంధించినవి కావు. ఈనాడు ఈ విధముగా ఉంటేనే కాకుండా యూనియను ప్రభుత్వములో యిది ఇట్లా ఉండేదానికే ఎక్కువ అవకాశము ఉంది.

అయితే అధికారుల ప్రభుత్వమువారు కేంద్ర ప్రభుత్వవారిచేత కోట్లకొలది రూపాయలు ఖర్చు పెట్టిస్తారా అనేదే ప్రశ్న. ఈ ప్రభుత్వము [illegible] నూతన శాసనసభ వారిని ఆయా స్కీములలో సంప్రదించవలెనని అభిజ్ఞులు అంటున్నారు.

## గుడ్డలు నూలు ధరలు

(1-వ పేజీ తరువాయి)

ముగా మేము అభిప్రాయపడుతున్నాము. ధరలు నిర్ణయముచేసే అధికారము ఉన్న ఇండస్ట్రీస్ కమిటీలో మిల్లు యజమానుల ప్రతినిధులు మాత్రమే ఉన్నారు. మరొకరు ఆకమిటీలో ఉండడానికి వీలు లేదు. అయితే ఇండస్ట్రీస్ కమిటీవారి సిఫార్సులను అంగీకరించడము కానీ అంగీకరించక పోవడము కానీ భారతదేశ ప్రభుత్వానికి [illegible]. అధికారుల ప్రభుత్వమువారు ఈ సిఫార్సులను ఎంత మాత్రము అంగీకరించకూడదని మా అభిప్రాయము. ఇది అతివేగముగా అంగీకరించినారు. మరునాడు ఉదయము కన్జూమర్ల బాధలను గురించి బోర్డు చర్చించడానికి పూర్వమే ఈ సిఫార్సును అంగీకరించినారు. ప్రజలు నూలుధరలు, గుడ్డలధరలు తగ్గుతవను కొంటూ ఉండగా ఈ సిఫార్సులను అంగీకరించడము దురదృష్టము. అధిక లాభాల పన్ను కిందటి ఏప్రెల్ మాసములోనే రద్దుఅయిపోయింది. అందువల్ల మిల్లు యజమానులకు ఇది లాభదాయకము.

ఈ విషయములో వివిధ రాష్ట్రీయ ప్రభుత్వాలవారు పూనుకొని ఈ అన్యాయాన్ని తొలగించవలెను.

ధరల హెచ్చింపవలసిందను తమ సూచనను ప్రభుత్వం ఆమోదించినట్లు టెక్స్టయిలు కంట్రోలు బోర్డు అధ్యక్షు థాకర్సేగారు నేటి బోర్డు సమావేశంలో ప్రకటించారు.

## రాజ్యాంగపరిషత్తు

1 వ పేజీ తరువాయి

### వైజ్ఞానికులను పంపాలి

న్యూఢిల్లీ, జూలై 4: దేశముయొక్కయు వివిధరాష్ట్రముల యొక్కయు ఆర్థికాభివృద్ధికి మార్గములేర్పరుపదగినందులకై, రాజ్యాంగ పరిషత్తుకు కొంతమంది ఎంజినీర్లను, ఆర్థికశాస్త్ర వేత్తలను, వైజ్ఞానికులను పంపించవలసిందని సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇరిగేషన్ జర్నల్ సంపాదకీయం వ్రాసింది.

## లీగుకు సింధు ప్రధానికి అభిప్రాయభేదం

కరాచీ, జూలై 4: ఖాన్ బహదూర్ ఖుహ్రో, పీర్జాదా అబ్దుల్ సత్తార్, ఈ మంత్రుల నిద్దరిని రాజ్యాంగ పరిషత్తు సభ్యులుగా యెన్నుకోవలసిందని ముస్లింలీగు ఉత్తరువు జారీచేయడంవల్ల, ఇక్కడి ముస్లింలీగు వర్గాలలో వివాదాలు బయలు దేరినవి. ఒకవ్యక్తి రాజ్యాంగపరిషత్తు సభ్యుడుగాను, మంత్రిగానూ కూడా పని చేయడం దుర్ఘటమనీ, అందువల్ల మంత్రులను రాజ్యాంగ పరిషత్తు సభ్యులుగా ఎన్నుకోకూడదనీ సింధు ప్రధానమంత్రి సర్ గులామ్ హుస్సేన్ హిదయతుల్లా అభిప్రాయపడుతున్నాడు.

కాంగ్రెసు మంత్రులు కొందరు రాజ్యాంగ పరిషత్తు సభ్యులుగా కూడా పని చేయబోతున్నప్పుడు, తాము ఎందుకు చేయలేమా అనీ, ఉభయత్రా పనిచేయడం అంత కష్టమైన పనికాదనీ, ఖాన్ బహదూర్ ఖుహ్రో ఇవాళ అన్నాడు. ఎన్నుకొనబడినవారు సమర్థులైతే, ఇదేమంత ఘనకార్యం కాదని, పీర్ ఇల్లాహీబక్ష్ (రెవిన్యూమంత్రి) కూడా ఈ వాదాన్ని బలపరిచాడు. ఈవిషయమును చర్చించడానికి సర్ గులామ్ హుస్సేన్ హిదయతుల్లా శాసనసభ లీగుపార్టీని జూలై 9 తేదీ సమావేశపరుస్తున్నాడు.

## ఫజ్లుల్హక్ విమర్శ

కలకత్తా, జూలై 4: బెంగాలు ప్రజా శ్రేయస్సునస్సుకు పట్టని పరరాష్ట్రీయులను, లీగు రాజ్యాంగ పరిషత్సభ్యులుగా బెంగాలులోనికి దిగుమతి చేస్తోందనీ, కాంగ్రెసు కూడా అభ్యర్థుల నిర్ణయ విషయంలో తగిన జాగ్రత్త చూపడం లేదనీ, బెంగాలు కాంగ్రెసు పార్టీలో ఉన్న వివిధవర్గాలు కలిసి కట్టుగా పనిచేస్తుండగా, ఎవరికి వారే రాజ్యాంగ పరిషత్తులో ప్రవేశించడానికి పోరులాడుతున్నారనీ, బెంగాలు మాజీప్రధాని ఫజ్లుల్హక్ విమర్శించాడు.

తన అభిప్రాయాలను రాష్ట్రపతికి [illegible] ఇప్పటికైనా దిద్దుకోడానికి సమయం మించిపోలేదనీ, హక్ అన్నాడు.

## గాంధి, నెహ్రూలకు ఫజ్లుల్హక్ తంతి

కలకత్తా, జూలై 4: ప్రజాపరిషత్తుకు బెంగాల్ రాష్ట్రము నుండి డా॥ బి. సి. రాయ్, డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ, డా॥ నళినాక్ష సన్యాల్ గారలను కూడా ప్రతినిధులుగా ఎన్నుకోవాలని ఫజ్లుల్హక్ గాంధీ, నెహ్రూ, పటేల్ గార్లకు తంతివార్త ఇచ్చాడు. —యు. ప్రై.

## రహస్య సమావేశం

రాజ్యాంగ పరిషత్తు సమావేశానికి పత్రికా విలేఖరులనుగాని ప్రేక్షకులనుగాని రానివ్వకుండుట మంచిదని ఢిల్లీ అధికార వర్గాలవారు భావిస్తున్నట్లు తెలుస్తుంది. ఇవాళైతే ఏ విషయం నిర్ధారణ [illegible] సభ్యులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను తెలుప వీలుకుండదని వీరు అభిప్రాయ పడుతున్నారు.

రాజ్యాంగ పరిషత్తు సెప్టెంబర్ రెండోవారం లోపుగా సమావేశపరుప బడక పోవచ్చును. రాజ్యాంగ పరిషత్తు మొదటి సమావేశం జరుగుతుండగా, సభ్యులకు ఇతరపని ఏదీ ఉండకూడదని అంటున్నారు.

## శాసనసభలో ప్రతిపాదించే తీర్మానము

షిల్లాంగ్, జూలై 3: అస్సాము ప్రధాన మంత్రి గోపీనాథ బార్డొలాయి రాజ్యాంగపరిషత్తు అభ్యర్థిత్వానికి వ్యక్తులు స్వతంత్రముగా నామినేషనులు దాఖలుచేయవద్దని కాంగ్రెసు అధ్యక్షుడి ఆదేశముప్రకారము అభ్యర్థులను నిర్ణయించడానికి ఒక కమిటీ ఏర్పడుతుందనిన్నీ ప్రకటనముచేసినాడు. మంత్రులు అభ్యర్థులుగా ఉండకూడదనే నిషేధాన్ని అస్సాము విషయమున ప్రత్యేకముగా భావించి కాంగ్రెసు అధ్యక్షుడు సడలించినాడు.

జూలై 6 వ తేదీన పార్టీ సమావేశములో గ్రూపింగ్ పనికిరాదని బార్డొలాయి ఒక తీర్మానము ప్రతిపాదించబోతున్నాడు. అస్సాము శాసనసభాసమావేశములో ఈ విషయాన్ని గురించి అధికార తీర్మానము ప్రతిపాదిస్తారు.

అస్సాం యూరోపియన్లు నిలబడరు

కలకత్తా, జూలై 4: అస్సాం శాసనసభలోనున్న యూరోపియన్లు రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలకు తమలోనుండి ఎవరినీ అభ్యర్థిగా నిలబెట్టక పోవడానికే నిర్ణయించుకున్నారని గౌహతినుంచి వార్త వచ్చినట్లుగా "హిందూస్థాన్ స్టాండర్డు" పత్రికలో ప్రకటించబడినది. అయితే, వోటింగులో పాల్గొనడమా పాల్గొనకపోవడమా అన్న విషయము ఇంతవరకు నిర్ణీతం కాలేదని కూడా ఆ వార్తవల్ల తెలుస్తున్నది.

## బెంగాల్ యూరోపియన్లు

కలకత్తా, జూలై 4: రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలలో వోటుచెయ్యడమా లేక కాంగ్రెసు కోరిన ప్రకారం మానడమా, అన్న విషయమై బెంగాలు శాసన సభలోనున్న యూరోపియన్ పార్టీవారు కొన్ని రోజులనుంచీ చర్చించుకుంటున్నారు.

రాష్ట్ర కాంగ్రెసు నాయకులతోనూ, లీగునాయకులతోనూ సంభాషణలు జరుపుతున్నారు. కాంగ్రెసు లీగు కలిసి, కాంగ్రెసుకు చెందనటువంటిన్నీ, మహమ్మదీయులు కానటువంటిన్నీ జనరల్ సభ్యుల జాబితా నొకదానిని తయారుచేసి, ఉభయపక్షములు ఆమోదించినట్లయితే, ఆ జాబితాలో ఉన్న అభ్యర్థులకే వోటు చేస్తామని యూరోపియన్లు కాంగ్రెసువారికి ప్రతిపాదనచేసినట్లు తెలుస్తున్నది. కాని అభ్యర్థుల జాబితా విషయంలో కాంగ్రెసు లీగులకు ఒప్పందం కుదరడం అసంభవం అనే కారణం వల్లనూ రాజ్యాంగ పరిషత్తులో కలగచేసుకోడానికి యూరోపియన్లకు ఏ రకమైన అధికారము లేదనే అభిప్రాయం ఉండబట్టిన్నీ, కాంగ్రెసువారు ఈ ప్రతిపాదనను నిరాకరించారు. ఇక 1, 2 రోజుల్లోపుగానైనా ఈవిషయంలో అంత్యనిర్ణయం జరుగవలెనని అన్ని పక్షాలు ఆతురపడుతున్నవి. —యు. పి. ఐ.

## పరిశ్రమలస్థితిగతులపై దర్యాప్తు

విచారణకోర్టు నియామకం

మదరాసు, జూలై 5: టెక్స్టైలు పరిశ్రమ పనివారల స్థితిగతులను [illegible] ప్రభుత్వం వారికి నివేదించుటకు ఒక విచారణకోర్టు ప్రభుత్వంవారు నియమించి విచారణకర్తగా రా॥ బ॥ వెంకట్రామయ్యగారిని నియమించారు. మిల్లు యజమానులయు పనివారలయు వాదోపవాదనలు విన్నపిమ్మట తన నిర్ణయాలను ప్రభుత్వంవారికి అందజేయును. [illegible] చర్య తీసుకొనవలెననే విషయం నిర్ణయింపబడును.

ప్రభుత్వ విధానం

ఏ యే పరిశ్రమల విషయంలో యిట్టి విచారణ జరుపడం అవసరమని ప్రభుత్వము తలుస్తుందో ఆ పరిశ్రమల స్థితిగతుల దర్యాప్తు చేయుటానికి విచారణ కోర్టులు నియమించే విధానము ప్రభుత్వం అవలంబింపవలసియున్నదని తెలుస్తున్నది. ఈకోర్టులు ఆయా పరిశ్రమల స్థితిగతుల విషయమై [illegible] విచారణలు జరుపగలవు. [illegible] పరిశ్రమలు [illegible] ప్రభుత్వం తయారుచేసే [illegible] తెలుస్తున్నది.

